శ్రీరంగనాయక సహాయం.



సద్బోధన

తెలుగున వచనంగానుండు



# వైరాగ్యప్రకరణము.

ఇది

కృష్ణాజిల్లా గన్నవరంపోస్టు ఆవటపల్లి గ్రామనివాసులగు

పెనుమూడి వెంకటప్పయ్యచే

రచియింపబడి

బెజవాడ

వాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపంబడియె.

1906.

# పీఠిక.

## సద్బోధనయందు ప్రథమప్రకరణము.

ఆత్మబోధకమగు జ్ఞానభక్తి వైరాగ్యముల వివక్షత తెల్పుతూ నిత్యతృప్తికరముగానుండు శ్రీమత్సదానందము కలగజేయు సంగతులతో వ్రాయబడినది.

బ్రాంహ్మణులు భారద్వాజసగోత్రం నియోగి పెనుమూడి బాపిరాజుగారి ద్వితీయపుత్రుడు వెంకటప్పయ్యచే వ్రాయబడినది.

శ్రీరంగనాయక సహాయం.

శ్రీగణేశ్వరాయనమః.

శ్రీశారదాంబాయనమః.



ఇష్టదైవముగానుండు శ్రీరంగనాథుని ప్రార్థించి శ్రీయఃప్రతికల గజేసిన ఊహను సార్థకపర్చుకొను బాధ్యత ఆశ్రీరంగనాథునిదేయని నిశ్చయించి ఇట్టికార్యమునకు నేనుచాలనివాడనయినను అజ్ఞానాపగమునకు ఒకండు తనశక్తికొలదిచేయు ప్రయత్నమునకు సత్పురుషులు సంతసిల్లి సాహాయులగుదురని నిరనమ్మి యిప్పనికి పూనుకొంటిని. నాసామర్థ్యలేశమున కినియక తలంపు మంచిది అని యెంచి వేత్తలు క్షమింతురని వేడెదను. సద్గ్రంథవ్యాసంగముచే కాలముసార్థకపర్చుకొను సుహృదయులకు సవినయ విజ్ఞాపనము జగన్నాథం, కాశి, గయ, ప్రయాగ, అయోధ్య రామేశ్వర శ్రీరంగం శ్రీశైలం వగయిరా పుణ్యక్షేత్రములు తరుచుగా సేవించుకుంటూ అచ్చట పుణ్యపురుషులవల్ల తెలియబడిన ఆత్మబోధననుబట్టిన్ని శక్తికొలది చూచిన సద్గ్రంథములలోని సంగతు

లనుచూచిన్ని రంగనాధుడు కలగజేసిన ఊహానుపట్టి సద్బోధనగా నక పుస్తకం తొమ్మిది ప్రకరణములుగా వ్రాయుటకు యత్నించి ప్రస్తుతం వైరాగ్యప్రశంశగల మొదటి ప్రకరణమును తెనుగులో వచనంగా సులభముగా తెలియుటకు వ్రాయబడినది. శ్రీరంగేశాయనమః.

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకునిచే సృజింపబడిన ప్రపంచమందన్ని దేశములలో భివసించువారిలో లెక్కండ్రు దుఃఖరూపకమగు జన్మమునొందకుండా నిత్యసుఖము నొందగోరి పాపకృత్యమునువిడనాడుచు పుణ్యాకార్యముల జేయుచు జీవించియున్నంతవరకు తాపత్రయమునొందకుండ సౌఖ్యముగా కాలముగడుపుచు లోకమందు సత్పురుషులనిపించుకొనుటకయి ప్రయత్నించుచుందురని యల్లరు నమ్మదగిన నిర్వివాదాంశమేగదా అట్టివారిలో మన వేదశాస్త్రములయందు ప్రామాణ్యబుద్ధిగల హిందువులు అంత్యంతికదుఃఖరహిత నిశ్రేయసపరమపురుషార్థమగు మోక్షమునుగోరువారలగుటంజేసి యట్టిమోక్షమునొందుటకు ముఖ్యసాధనము నిత్యనైమిత్తికకామ్యాదికర్మములా? యేకాక్షరీ ద్వ్యక్షరిపంచాక్షరి షడక్షరి అష్టాక్షరి ద్వాదశాక్షరి షోడశాక్షరిమొదలగు మంత్రములా? తర్కవ్యాకరణాదిషడంగసహితవేదవేదాంతశాస్త్రవిచారమా? సకలప్రపంచసుఖముననుత్యజించుసన్యాసమా? యమనియమాధ్యష్టాంగసహితహఠయోగమా? అహంబ్రహ్మాస్మిత్యాది మహావాక్యానుభవయుక్తస్వాత్మానుభవజ్ఞానమా? అని సందేహములు గలుగును గనుక దానిగురించి వివరింపబడును.

అందుకు మోక్షమునకు పరంపరసాధన క్రమమెట్లనగా.

శ్లో॥ నిర్మత్వంవిరాగాయవైరాగ్యాత్ యోగసంగతిః।
యోగాచ్ఛజాయతేజ్ఞానంజ్ఞానాన్ముక్తిః ప్రజాయితే॥

జ్ఞానవాశిష్టేనిర్మోహామువలన వైరాగ్యము వైరాగ్యమువలన యోగము యోగమువలన జ్ఞానము జ్ఞానమువలన ముక్తియుగలుగును.

శ్లో॥ ఆలోక్యసర్వశాస్త్రాణివిచార్యచపునఃపునః।
ఇదిమేకంసునిష్పన్నంయోగశాస్త్రంపరంమతం॥

శివసంహిత అన్ని శాస్త్రములు మాటిమాటికి విచారించి చూడగా యోగశాస్త్రమే శ్రేష్ఠమై మోక్షసాధనమగుచున్నది. నాకు యితరవ్యాసంగము లేకుండా గంగాతీరమందు సజ్జనసేవతో కాలముగడుపుటకు యోచించితే అవకాశము కర్మవశంచొప్పున కుదరకుండావున్న వర్తమానకాలములో యీసద్బోధనరూపేణ నాఅభిప్రాయం లోకులకు వెల్లడిపర్చి అందులకు వారికి కలగబోవు సందేహములకు తెలిసినవారలుగావుంటే నాకు తెల్పడం తెలియునవివారలకు నావల్ల తెలుసుకోవడము జరగగలదు అని ఊహించుకొంటిని.

యీపుస్తకముయొక్క ఉపయోగమును భగవద్భక్తిగలవారకే తెలుసును.

పేదరికముగలవానికి ఏపనియందును దీనిని మనము నిర్వహించజాలమనిభీతిచేత కార్యనిర్వాహకులతోడ సమముగావర్తించుటలో సిగ్గుపుట్టుచున్నది. ఇట్లు సంకోచకరూపకమయిన సిగ్గుగలిగిన వెనుక బలము కృంగిపోవును. బలమెప్పుడుకృంగునో అప్పుడు శక్తులగు ఇతరులు చేయునట్టి తిరస్కారములకు సహించవలసివచ్చును యిట్లులోకుల తిరస్కారములను సహించుటలో చింతగలుగును చింతాక్రాంతుడైన పిదప చింతించి చింతించి చివరకే ప్రతికారముతోచక దుఃఖఅయిపోవును దుఃఖాక్రాంతునకు బుద్ధిచెడును ఆబుద్ధియెట్టిది ఇది మంచిది ఇదిచెడ్డది అను భేదము యెరుగునట్టునది అట్టి వివేకము లేక పోయిన పిమ్మట అన్నివిధములలోను చెడి నశించుట కారంభించును. కాబట్టి అయ్యో పాడుదరిద్రమనునది సమస్తకష్టములకు ఆశ్రమంబైనదిగాన ధనముసంపాదనలో జాగరూకుడుకావలెను యింతసంపాదించవలెనని పాగములేదు ప్రయత్నలోపములేక వచ్చినంతట్లో సంతృప్తినిజెంది యుత్సాహమును భంగపర్చుకొనక వివేకమును చెడగొట్టుకొనక బుద్ధిశాలియై వర్తించువాడు దుఃఖాక్రాంతుడు కాచాలడనియెరుగనగును. లోకంబున నత్సాహాసంబును వివేకంబును రెండును కన్నులనంభుడును ఈరెండును లేని

వారలు యెట్లుగా అభిప్రాయపడినను వారిలోపమేమియును లేదు చె ట్టుక్రిందపరుండి ఆయాచితవ్రతముగలవారయినను సంపదలను లక్షింపక యుండువారలు భాగ్యవంతులు జిహ్వోపస్థులకు లోబడిన సంపదెళ్ళ కలుగును అదిలేకపోదే సంపద తృణీకృతంబనబడును. దేనిని చూడబోయినను యీశరీరభోగములు కష్టములే తోచుచున్నవి. పుత్రమిత్రకళత్రాదులు, సుఖమునొందుదమన్ననో సంయోగాస్తు వియోగాంతకః చేరికలన్ని యెడబాసిపోవుటయే కొనగాకలిగినవి. ఆసుఖములునైనా నంత్యమునొందకపోయె. పుణ్యసంపాదనకు తగినదనిచూతమాదురితసమూహముతోనుగా ఘటించుచుండును స్వతంత్రముగలదని చూతమాదుష్టసేవజేసి బ్రతుకవలసియున్నది. పోని జీవనసౌఖ్యమొందుదమన్ననో బ్రతిమాలుచు బ్రతుకవలెను. ఇంతయునయ్యె ఒకరికి ఉపకారమగునాయనినదురుపయోగంబైపోవును ఇట్లుసదుపయోగముగాని దేహయాత్రవలదు కలిగినా సర్వోత్కృష్టపుణ్యసంపాదకంబగుగాకయని భావము. ఈదేహమంతయుమలపుంజము యచ్చటచూచినను కశ్మలము కమ్మివచ్చుచుండును కంటిలో గీజు చెవిలో గులిమి ముక్కులో చీమిడి నోటిలోచొల్లు తలలో పినుకుడుచుండు క్రింద మలమూత్రంబులు మేనంతమురికి యిట్లున్నందున రోతయగు దేహమునందు ఇంద్రియభోగములన్నియు చాలుననిపించెను ఇంద్రియంబులచే ననుభవించుచెడ్డవస్తువులకన్నను మనఃప్రీతిప్రాంతంబులయిన ఈషణత్రయాదులు త్వరగా ప్రాణులను చేర్చుచున్నవి. ఎట్లనిన విషాదులు దేహమున ప్రవేశించి హిసించును. ఈషణత్రయాదులట్లుకావు జ్ఞప్తి మాత్రముచేహానివచ్చును దారాపుత్రాది ధనంబులకు యచ్చటనో యేమో కష్టము ప్రాప్తమయినదని వినిన మాత్రాన దూరదేశగతుడయియున్నను తదభిమానియగు ప్రాణికివ్యసనము సంభవించి యది ప్రబలితుడకు ప్రాణాపాయముగాను యేర్పడుట లోకవిదితముగదా గుణిగుణంబు గుణియేఱుగును గుణహీనునకు యేమితెల్పునూ అనే న్యాయుంకలదు. వృత్తులు ఆహా

రములు భక్తిశ్రద్ధలు నియమములు సత్వరాజసతామసగుణములనుబట్టి తదంశలో జన్మించినవారలకుగాని లభింపవని శ్రీభగవద్గీతలలో స్పష్టపరచియున్నది. మనుష్యులుస్తోత్రప్రియులు సన్మాం సర్వానర్థకం చావునకు వెరచినట్లుగా యితరులు మెచ్చుకోవడంకు వెరువవలసినదని ఆచార్యస్వాములవారి అభిప్రాయంశాస్త్రమనంతం గురవోవివిధఃస్వానుభవోన హీపూర్ణస్తే అనేన్యాయంవోప్పున స్వంతఙ్ఞాహాకు సరిపోనుభక్తి జ్ఞానములు ధృవంగా నిలవగలవిగానుండును. దాహాము కలిగ్గినవారలు సామీప్యంలో జలమును సంపాదించి సంతుష్టిపరులు కావలసినదిగాని అప్పుడు జలంకోసం నుయ్యిత్రవ్వుటకు ఆరంభించరుగదా ఈశ్వరేచ్ఛగా యేపురుషులకు యేయేపనులు నెరవేర్చుటకు అభిలాషయేర్పడి అలవడినదుచునో ఆయాపనులు ఆయాపురుషులవల్ల నెరవేర్చుకోవడం సులభముగానుండును- యీప్రపంచములో అన్నిటికన్నను తేలికఅయినది అధముని అడగబోవడమెంతగుమర్యాదస్తులను అడిగితే ఒకవేళ లాభమేమియు లేకపోయినను గౌరవంచెడదు. సూర్యోదయాస్తమయంబులంబ్రబలిదినంబు నాయువుక్షీణంబు నొందదేహకళత్రమిత్ర భ్రాతృమమత్వపాశాబద్ధులై విడివడు నుపాయంబుగానక సంసారాంధకారమగ్నులై గతాగతకాలంబు నెరుంగకది వాంధంబులగు జంతుజాలంబులభంగి జన్మజరారోగవిపత్తి మరణంబులందియు శరీరంబేమేలనుచు ప్రమోదమోహామదిరాపానమత్తులై విషయానక్తతగజిక్కి- తమ్ముదామెరుంగకయుండి విరక్తిమార్గణంబు దెలియక వర్తించు మూఢులగు జనంబున పోతలంబోవక నారాయణభక్తి భావంబుగల సద్గురుం బ్రబలిదినంబును భజయించి సాత్వీకంబు భూతదయయును హరికథామృతపానంబును బ్రంహ్మచర్యవ్రతంబును విషయంబులం మనంబున జేరకుండుటయు సాధుసంగమంబును సజ్జనమైత్రియు వినయసంపత్తియు సుచిత్వంబును క్షమయు మానవ్రతంబును వేదశాస్త్రాధ్యయన తద్ధర్మానుష్టానంబును సహింపయు సుఖదుఃఖాదిద్వంద్వసహిష్టతయునీశ్వరుని సర్వగతునిగా భావించుటయు ముముక్షుత్వంబును జనసంగవర్జనంబుకు వల్కలాది ధారణం

బును యదృచ్ఛాలాభసంతుష్టియు వేదశాస్త్రార్థ దిజ్ఞానయును దేవాంత రనిందావర్జనంబును గరశత్రయశిక్షణంబును సత్యవాక్యతయు శమదమా ది గుణావిశిష్టత్వంబును గృహారామక్షేత్ర కళత్రపుత్రమిత్రాదుల హారి కర్పణంబు సేయుటయు నితరదర్శనవర్జనంబు చేయుట భాగవతోత్తమ ధ ర్మంబులు.

క॥ కరణత్రయముల చేతను। నరుడే కర్మంబు సేయున య్యే వేళన్।
హరికర్పణ్ణమని పలుకుట। పరువడి సుజ్ఞానమంత్రుపరమ మునీంద్రుల్॥

శ్రీలక్ష్మీదేవియొక్క మనస్సును అపహరించినవాడవును శుభ స్వరూపుడవును లోకసృష్టికారణమయిన ప్రథమసృష్టికి కారణమయిన వాడవును, నైన ఓస్వామీ సమస్తలోకములు నశించి ప్రళయసము ద్రమునందు కలయుగా, ఆసముద్రమునందు ఆడుకొనునట్టి పశిబిడ్డవలె వటపత్రముమీద తేలి యాడుచు, నారాయణుడు అనెడి ప్రసిద్ధమయి న పేరును వహించి వెలుగునట్టి నీనాభికమలమునందు, సృష్టికర్తయైన బ్రహ్మ మొట్టమొదట పుట్టెనుగదా, పృథివి, అప్పు, తేజము, వాయువు, ఆకాశము, అనునట్టి పంచమహాభూతములును మూలప్రకృతియు మహా త్తత్త్వము, అహంకారము మొదలయినవి, చతుర్దశేంద్రియములును, వా నివృత్తులయిన శబ్ద, స్పర్శ, రూప, రసగంధ వచనదానగమనాదులును, పదునాల్గులోకములును, ఆలోకములకు కారణభూతుడయిన, బ్రహ్మాది మూర్తులును, సచ్చిదానందనిర్మలపరిపూర్ణమైన నీవిరాడ్దేహమునందే పు ట్టను వృద్ధిపొందును లయించును నీవు జడభావము లేక పరమాత్మస్వ రూపుడవయియుండుదువు. యిట్టినీస్వరూపమును లెస్సగా విచారించి తెలుసుకొనుటకు యెంతటి బ్రహ్మవేత్తలు సహితము శక్తులుగారు అట్లుం డగా మాయయును, ఆమాయాసంబంధము చేత ప్రపంచసృష్టిరూపమై న వినోదమును చేయునట్టి బ్రహ్మయును నీచిద్విలాసమిట్టిదని నిర్ణయిం చుటకు కర్మలా కారు, నీకళాంశజులైన బ్రహ్మరుద్రేంద్రవసిష్టాదులు, చ తుర్దశేంద్రియములను వానివృత్తులయిన శబ్దస్పర్శాదులును వానిఅధి

దేవతలయిన చంద్రబ్రహ్మజీవరుద్రాదులును అంటకసాక్షివై వెలుగుచుం దువని సృష్ట్యాదికార్యములయందు బ్రహ్మాదులను నియమించువాడవని, అందుకొందరు వేదమార్గమునననుసరించి నీవు ఋష్యింద్రాదివేవతాప్రభు వుల పేళ్ళువహించి, ప్రకాశించుచు విచారించినప్పుడు ఒక్కడవై కను పడుచుందువు అనియు జ్ఞాననిష్ఠులైన కొందరు ఆగామిసంచితప్రారబ్ధక ర్మములను విడిచి అంతరబాహ్యసంసారసంబంధము లేక వైరాగ్యమును పూని అనుభవజన్యజ్ఞానదృష్టిచేత అపరోక్షముగ తెల్పుసుకోదగినవాడ వని మరికొందరు పాంచరాత్రాగమమును అనుసరించి భగవత్స్వరూపస్య మును వహించి ప్రకాశించు ప్రత్యగాత్మవని కొందఱువాసుదేవ సంకర్ష ణ ప్రద్యుమ్నానిరుద్ధులనెడి చతుర్వ్యూహసంగతిచేత, నలుగురై ప్ర కాశించునట్టివాడవనియు ఇదిగాక నీవు నారాయణుడు అనుపేరుగలవా డవనియు శివుడు అనుపేరుగలవాడవనియు ఇట్లు బహువిధములుగా ని న్నుతలంచుచుందురు- సర్వవ్యాపివగుటచేత అట్లుతలంచుటవలన లో పమేమిలోకమునందలి యేళ్ళుయేతట్టుపారిననుకడపటసముద్రమునందే వ చ్చికలయుచుండునట్లు యీవిశేషనామ రూపాదులన్నియు కడపటనీ యందేలయించిపోవును ఒకచంద్రబింబము జలఘటములో ప్రతిఫలించి అనేకములుగాతోంచియు విచారించునపుడు ఆబింబము ప్రతిబింబములకు భేదములేనియట్లు నీవును బహువిధముల కానబడియు ప్రళయకాలము నందు నశింపని రూపముతో ఒంటరివాడవయి యుందువు. ఓస్వామీ, నీకుఅగ్ని ముఖము,చంద్రుడును,సూర్యుడును, రెండుకన్నులుదిక్కులు చె వులు భూమిఅడుగులు, సముద్రములు కడుపు,కొండలుయెముకలు, తీగ లును వృక్షములును రోమములు, గాలి, ప్రాణము, చేతులుఇంద్రాదు లు, మేఘములు, తలవెంట్రుకలు ఆకాశము బొడ్డు రాత్రియును, పగ లును నిమేషములు బ్రహ్మగుహ్యము, రేతస్సువాన, స్వర్గమునడితల, ఇట్లుఇవియన్నియు నొక్కటిగా గూడగా, నేర్పడిననీవిరాడ్దేహమునందు చక్కగా ఫలించిన, అత్తిచెట్టునందు కానవచ్చెడు అత్తిపండ్లలోని, పురు

గులవలె, సకలజీవ, సంఘాతముతో, గూడిన, బ్రహ్మాండ,ములునిండికొ. ని యుండుము, నీరూపమిట్టిదని చెప్పుటకు శక్యముగాదు, మరియునీవు, మత్స్యావతారమెత్తి సోమకాసురుని సంహరించి, బ్రహ్మకు వేదములు తెచ్చియిచ్చితివి, మధుకైటభులను చక్రధారివై చంపితివి కూర్మావతారమెత్తి మందరపర్వతమునకు, ఆనికగానిల్చితివి, వరహావతారమెత్తి హిరణ్యాక్షునిచంపి కోరకొమ్ములతో,భూమిని నిలువబట్టితివి, నరశింహ్వావతారమెత్తి భయంకరుడైన హిరణ్యకశిపునిజంపి దేవతుల భయమును పోగొట్టితివి వామనావతారమెత్తిబలినియాచించి, బ్రహ్మాండమంతయు నిండుకొనునట్లుదేహముపెంచి భూమియంతయుపుచ్చుకొంటివిపరసురామావతారమెత్తి లోకములోని రాజులనందరిని పలుమారు వెదకికొట్టి చంపితివి శ్రీరామావతారమెత్తి శీతకై రావణునిసంహరించితివి శ్రీకృష్ణబలరామ ప్రద్యుమ్నానిరుద్ధరూపములనుధరించి క్రూరులైనరాక్షసులనుసంహ్వారించితివి బౌద్ధావతారమెత్తి శత్రువులైన త్రిపురాసురుల భార్యలమనస్సులుకరగించి వారిపతిభక్తినితొలగించి మించితివి కల్క్యావతారమెత్తిగౌరవమునుసంపాదింపగలవు యిటువంటినిన్ను శ్లాఘింప నేనుయెంతమాత్రపువాడను కలవరమును పొందినమనస్సుగలవాడనునీయందలిప్రపత్తినిచేయుచుండువాడను యిట్టినాయందుఅనుగ్రహముగలవాడవై దుఃఖముపొందిచెడకుండ నన్నుకాపాడుము ఓశేషశయినా ఓ దయాభరణా సేవకకల్పవృక్షమా నీకుపలుమారు నమస్కరించెదను చిత్తగింపుములని తాత్పర్యము.

శ్రీమత్సదానందమంచిత్యమవ్యయం
శ్రీమత్సదానందమరూపమద్వయం
శ్రీమత్సదానందమఖండమచ్యుతం
శ్రీమత్సదానందమగుణంనమామ్యహం॥

శ్రు॥ తరతిశోకమాత్మవిత్ । అని శృతివాక్యము గనుక నాత్మ

జ్ఞానచే దుఃఖమనుసాగమును తరింతురని ప్రమాణం॥

శ్రు॥ జ్ఞానమేవమోక్షః। అనియు జ్ఞానంవినామోక్షోసిధ్యతి॥ అనియు శ్రుతిపలుకును ఇందుకు సాధనములు భక్తివైరాగ్యములు వైరాగ్యమనగా యీషణత్రయవర్జితుండై దేహాభిమానము విడుచుటయె యీషణత్రయమనగా ధనేషణ దారేషణ పుత్రేషణలనంబడు యిందు పుత్రేషణ యెట్టిదనిన పుత్రులుపుట్టకముందు పుట్టరాయెనని దుఃఖము పుట్టియంగరహితమైన దుఃఖము వ్యాధిగలిగినేని దుఃఖము ధూర్తుడాయెనేని దుఃఖము విద్యరాకపోయిన దుఃఖము పెండ్లిగాకపోయిన దుఃఖము తన్నెదిరించిన దుఃఖము మరణమాయెనేని దుఃఖమునకు పారములేదు యికధనేషణయెట్టిదనిన ధనములేనికాలమునందు లేకపోయెనను దుఃఖము ధనార్జనకాలమునందును దుఃఖము వ్యయకాలమందుమిక్కిలి దుఃఖము రాజ చోర దారాపుత్రాదులు నెక్కడనపహరింతురోయని సర్వదాదుఃఖము ఇకదారేషణయెట్టిదనిన కామాతురుడై రక్త మాంస మల మూత్ర దుర్గంధములచేనిండబడ్డ అవయవములుగల స్త్రీభోగములంజిక్కుబడి చింతనేయనుభవించుచు సుఖమనితలంచి వీరిని పోషించుటకయి శునకశూకరాదులవలె శిగ్గవిడచి కృషివాణిజ్యసేవకాది ప్రయాసలకు నొడంబడు మూఢులయవివేకము దారేషణయనంబడు యివియే యీషణత్రయంబులనంబడు ఇక దేహాభిమానమెట్లనినయీదేహమెత్తినది మొదలంత్యమువరకు చింతనేయనుభవించును ఏలాగనిన యీదేహము తల్లిగర్భవాసమందుండు కాలంబున మలమూత్ర క్రిమికీటకాదులవలననుజఠరాగ్నిచే తపించుచు తల్లి భోజనముసేయగా గర్భములోసందులేక నిండియుండుటచేత శ్వాసము విడుచుటకు శక్తిలేకను జన్మకాలమందు ప్రసూతివాయువుచే పర్వతాగ్రమునుంచి తలక్రిందై బహు క్రిమివలె భూమియందుబడి దుఃఖించుటచేతనున్నా మలమూత్రములలో పొరలాడుచు గర్భవేదగలిగినను చీమ దోమ వృశ్చికాదులచే కాటుబడినను చెప్పుటకు నోరురాక దుఃఖించుటచేతను యౌవనం

బున కామాతురుడయి కామాగ్ని చేకాలుచు భార్య లేకపోయెననియు బిడ్డలు లేకపోయిరనియు ధనము లేకపోయెనను చింతచేతను జరామరణ ములుగలిగి జడమై అనిత్యమై దుఃఖస్వరూపమై మలమూత్రమాంసశో ల్యరక్తక్రిమినరములపై చర్మముబో దిగిన జంత్రపుబొమ్మకైవడి కరచ రణాద్యవయవాకారమై యరిషడ్వర్గములకు నాలయమై ఆదిమధ్యాం తములయందు సర్వదాదుఃఖముగలదీ శరీరమనియెఱుంగక పామరముచే యుచుండెను మూఢులయవివేకమే దేహాభిమానము యిదేసంసారబంధ ము ఇందుకు దృష్టాంతము। నిరాలంబోపనిషత్తు దుఃఖమితీచః॥ అనిత్యసం సారవిషయబద్ధోదుఖః। అని చెప్పియున్నది గనుక వివేకులయినవారు వి చారించి యీదేహముని భోగములు హేయములనియు దుఃఖకరములని యు నెరిగి జన్మరహితమైన మోక్షమెవరివలన గలుగును ఏపుణ్యాత్ముల వలన తెలియవచ్చునని యార్తిబొందుటయె వైరాగ్యముగాన దేహాభి మానమెబంధము యిందుకు దృష్టాంతము నిరాలంబోపనిషత్తు కర్తృ త్వాద్యాహంకారసంకల్పోబంధఃఅనగా నేనుకర్తనుయిదినాయదియను హంకారమె బంధము నాభార్యా నాబిడ్డలు నాధనము అనుటయే జీవ త్వము యిట్టియభిమానమువిడిచినేని జీవన్ముక్తిని బొందును. ముఖ్యము గా దేహాభిమానము విడువవలయును లేనియెడల సంసారమను నరక మందు మునుగును నిరాలంబోపనిషత్తు అసత్యసంసార విషయ నకసంసర్గయే నరకః॥ అని చెప్పియున్నది గాన నీయీషణత్రయ ములను విచారించి వీటియందభిమానము విడువవలెను. అదియెటువలె నన్నను భార్యయొక తల్లిదండ్రులకుబుట్టియు తానొకతల్లిదండ్రులకు బు ట్టియు జన్మమందు నాయిద్దరు నొకనాడురాకపోవుట తెలిసియు నడుమ కర్మబంధముచే అడవియుసిరికాయుసముద్రపులవణమును కలసినట్లుకలసి నను అంత్యమందువొకరినివిడచి యొకరుబోవుచున్నారుగాని యొకరితో నొకరు వెళ్ళుటయును లేదు ఒకరిని నొకను చావకుండునట్లుచేయుశక్తియు నులేదు గాన నాభార్యయనగూడదు యికపుత్రులన్న నాపుత్రులను నీ

వు సృష్టించలేదు నీభార్యసృష్టించలేదు యితరులును సృష్టించలేదు యి దియునుగాక పుత్రుడు మృతుడాయెనేని నీవుతోడుబోవుటలేదు నీవున్మృ తిబొందితివేని నీపుత్రుడు నీతోడవచ్చుటలేదు మృతపుత్రునినిల్పుకొను శక్తియునునీకులేదు గాన నాపుత్రులనుట భ్రాంతియె అదియెట్లనిన స్వ ప్నమందు గొడ్రాలు బిడ్డలగన్నట్లు భగవత్సృష్టివలన నీకొకపుత్రుడుగా తోచెను యీపుత్రుని యేలాగున నాపుత్రుడనవచ్చును. భగవత్సృష్టి వలన గలిగిన పుత్రదారాదులను భగవత్పుత్రులనవలెన్కాని తనపుత్రు లనరాదు ధనము నాయదియనిన నీవుజన్మించుతటితోడ తెచ్చినదిగాదు అంత్యకాలమందుననీతోడగొనుపోవుటయునులేదు గనుక నాదె ననగూడ దు యీపణత్రయములు నాదిగావన్న నీదేహమైనను నాదికాదాయని నరాదు యెటులనంటె ఒకరివద్ద నెరువుకుతీసుకొన్న యిల్లువంటిదని యె రుంగునది యీదేహము యెరువుఅనుటకు దృష్టాంతము తానువశించుట కు యిల్లును వాడుకొనుటకు పాత్రలును నొకరినడగి తీసుకుని యా యింటప్రవేసించి కొంతకాలమాయింట సుఖించియుండగా నాయిల్లుగ లవాడు నాపాత్రలు నాయిల్లువిడిచి వెళ్ళమన్నప్పుడత్యాశచే మరపుగ లిగి యిదినాయిల్లు నాపాత్రలు నేనువిడిచివెళ్ళుటలేదన్న నిల్లుగలవాడు స్వతంత్రుడవుటచేత తనయిల్లు తనపాత్రములను బలత్కారముగా తీసు కుని పరులసొమ్మునకాసించి యబద్ధమాడినందుకు ప్రభువుచే శిక్షితుంజే యించినవెనుక తానుండుటకిల్లుమరల నడగిన నిల్లుగలవాడు వీని నమ్మక నిల్లుపాత్రములనివ్వనట్లీశ్వరుడు తనను వేడుకొనగా కరుణించి యిచ్చిన మనుష్యజన్మమును సర్వసంపదల నెవడు నాదినాశరీరము నాబిడ్డలునా భార్యా నాధనము నాయిల్లని యాశచే విడువనోపడో యట్టి పామరుని భగవంతుడు స్వతంత్రుడగుటచేత తనపదార్థములను త్యాగ్రహించి పామరముచే నాశించినందుకు నరకమందు శిక్షించి పునర్జన్మమందు వా నికి మేలైన మనుష్యజన్మమును సుఖించుటకు తగిన భోగభాగ్యములు నివ్వక క్రిమికీటకాది శునక శూకరాది జన్మములిచ్చి శ్రమంబొందించు

ననిన జాగ్రతావస్థలో జీవుడనుభవించినది చూచినది విన్నది తలంచి నది సంకల్పించుకొనువస్తువులా స్వప్నావస్థలోనవియే సత్యముగానను భవించినట్లుండును గనుక యీజన్మములో నాసించిన విషయవాసనతె మరణము పొందునపుడు తలంచుచున్నందున పునర్జన్మమున కంకురమైన దానికి తగిన శరీరము నెత్తియనుభవించును గాన నజ్ఞానముచే మృతి బొందినవారు పుట్టుటసత్యము ఎపుడు బ్రహ్మజ్ఞానము గలుగునపుడు జన్మ రహితమౌను॰ కావునని జగంబు యెండమావులవంటిదని యెరింగి దీని యందు నిరాశగలవాడయియుండవలయును శ్లో॥ పంచభూతాత్మికం। వి శ్వంమరీచిజలసన్నిభః॥ అని చెప్పియున్నది ఇందుకుదృష్టాంతము యొండ చేతప్తమై దాహముగొన్నవానికి యండమావులను చూపి యిదిగో జ లమీజలముచే స్నానముచేసి మడిగట్టుకొని వంటజేసిభుజించి తృప్తిగా దాహము పుచ్చుకొని సుఖపడుటకయి పరుగులిడుమని బోధించి. న వానిమాటలు నమ్మి యాశజెంది వీనికయి శ్రమబొంది యెంతద వ్వరిగియు నాజలము చిక్కనందుచే తృప్తిగానక తుదకు నిరాశుడయి లటుల సంసారతాపత్రయములచే దహింపబడి యీదారా పుత్రాది ధన సంపదలు సత్యములని బోధించేవారి మాటలునమ్మి యాశజెంది వీనికై దివారాత్రములు శ్రమబొంది యేవిధమున తృప్తిగానక నత్యంతమున మృత్యువుచేజిక్కి తుదకొకటియు లభింపక నొంటరియైయమభటుచేబా ధలునొందెను యీరీతి పామరముదెలియకుండుటకు కర్తవ్యంబేమనిన భగవంతుడుజేయునుపకారమ్ముల మరచుటచే నియజ్ఞాంబుగలిగెను ఆయు పకారంబు లెవ్వియన తననుతల్లిగర్భమందు నవమాసములు పోషించు వాడును వుత్పత్తితోడనే వీనిసంరక్షణాధకామై తల్లిస్థనములయందు న న్యముగల్పించువాడును జగద్విచిత్రములు జూచుటకు నేత్రములును వి నుటకు శోత్రములును రుచులు గ్రహింపజిహ్వాయు గంధాధులనాఘ్రా ణింపఘ్రాణమును నడవపాదములను ధర్మకర్మములుచేయుటకు హస్త ములు సర్వమునుగ్రహింపబుద్ధియు నిటుల సర్వేంద్రియముల నిచ్చినవా

డును దారాపుత్రధనధాన్యగోభూ హిరణ్యాదులను పానసస్యాదులకయి వర్షమును సర్వసంపదలనిచ్చి యానందపర్చునీశ్వరుని మరచి సర్వకాలములరాజులను దారాపుత్రాదుల సేవలు చేసుకొనుచు నోటికుండలో పోసినసీరు క్షీణించునట్లుదినదినమునుదయాస్తమయములయందునాయువు క్షీణమగుచుండ నిరుంగక మధుమక్షికములుబహుప్రయాసపడికూర్చిన మధువుని తెరులనుభవించునటుల తానును నతిప్రయత్నముచే గూర్చిన ధనధాన్యములు రాజచోరపుత్రభ్రాతులపాలయి జింహ్వాచాపల్యముచే గాలముమ్రింగిన మత్స్యమువలె జిక్కు-బడి గుహ్యాచాపల్యముచే వలం జిక్కు-బడిన సతియనుకపోతంబునుంజూచి పతియగు కపోతంబువిడువలేక తనమర్మమును దెలియక చింతింపుచులుబ్ధకునికోలంగూలిన కపోతంబుచందంబున్నమృతిబొందునుగనుక భగవదుపకారంబులందలంచివివేకులైనవారు లోకమర్మమునెఱింగివీటియందుజిక్కు-బడకవిరక్తిజెంది విరాగులయినసద్గురువులనాశ్రయించి చతుర్విధశుశ్రూషలజేయుచు నిష్కాపట్యభక్తియుక్తులయినవార్లకుగాని యితర్లకు లభింపదు॥ ఇదంతెనా తపస్కాయనభక్తాయకదాచన నచాశుశ్రూషవెవాచ్యంనచమాంయోభ్యసూయతి॥ అని భగవద్వాక్యమున్నది.

క॥ నిపాదకమలసేవయు। నిపాదార్చకులతోడి నెయ్యమునునితాం।
తాపారభూతదయయును। దాపగుమందారనాకుదయ సేయగదే॥

స్వకులోచితసత్క-ర్మానుష్టానధర్మమువలనగాని యదార్థజ్ఞానమునిల్వదు. సూర్యబింబప్రకాశం సర్వత్రా వ్యాపించినను నిర్మలంబగు జలదర్పణాదులయందు మాత్రమె ప్రతిఫలించును. పరబ్రహ్మస్వరూపము అన్నిశరీరములయందు సమత్వంగావుండినను నిర్మలహృదయులకు మాత్రమేనిశ్చయవివేకములుతోచబడుచుండును. గారిడిచేయుచున్నవారలుహస్తలాఘవంచేయుసమయం చూడవచ్చినజనుల ఆశ్చర్యదృష్టివానిసహపాటియగు ఆనేర్పు యెరిగినవానికి అందులఆశ్చర్యము యెట్లుండదో నిజమునుతెలుసుకోబడినపిమ్మట సంసారవ్యామోహ [illegible]

ళ్ళా అక్లేతటస్థభావముగా తోచబడును. విశేష తేజోరూపకమగు దీపముఅయినను దానిదిగువభాగమునని చీకటికాచియున్నట్టుగా శ్రవణమననంవల్ల కలిగిన వ్యామోహములు యోచినచేయగా దేనియందుపుట్టినదో దానియందే లయించును వాంత్యాశనమువలె విరక్తికలుగును నిత్యానిత్యవస్తువివేకతగల బుద్ధిశాలికి ఆహార విహారాదులలోజాగరూకతకలిగివుండును. కష్టములు భగవంతునిచే మనఆత్మ క్షేమంకొరకు పంపబడిన దేవదూతలనియు వరములయు తలంపవలెను. సుఖముచేభగవంతుని మరచినప్పుడు కష్టములువచ్చి తిరిగి అతనిని తలంపుకు తెచ్చును గనుక కష్టములు ప్రచ్ఛన్నసుఖములని చెప్పవచ్చును. సుఖదుఃఖములకు సమముగా భగవంతునకు వందనము చేయగలిగినప్పుడే ఆత్మకు గాఢమయిన భక్తి యలవడును. దినపరిమితిలోదక్క-జాగ్రతావస్థలోగదా ఆహారవిహారాదులకు సదసద్వివేక యోచినకు భక్తిశ్రద్ధలకు యేర్పరచబడిన అవకాశంఅయివున్నది. వకటిచేస్తూయింకొకదానియందు ఉద్దేశ్యంవుంచకపోవడపు ప్రకరణసుద్ధిగల బుద్ధినిర్మలత యేర్పడడమె ముఖ్యంగానుండతగ్గది రహశ్యకృతపాపులుగాక ఇల్లుచుట్టూ కాలుచుండగా నాఇంటనుండు పురుషుడు తపించునటుల సంసారమందు నుండువారలు నన్ను యెవరు రక్షింతురోయని యార్తిబొందుటయే వైరాగ్యమనబడును. బ్రంహ్మార్పణబుద్ధిగల సత్పురుషులకు ప్రతిష్టకొరకు ప్రతిఫల ఆపేక్షకొరకు కాకుండా యెది కృష్ణార్పణంగా యివ్వబడునో అది యేత్యాగము మనసెరిగి చేయుదానం.

శ్రీవైకుంఠమురంగమందిరముగా శ్రీభూసతుల్గొల్వన।
శ్యావేటితటమందు శేషఫణిభోగంబూనితా యోగని।
ద్రాప్రాభాజితుడైనపుణ్యపురుషుండాజినేత్రుమహాత్మ।
వ్యాసితుమహానుభావుగొలుతుశ్రీరంగనాథున్విభున్॥

వైరాగ్యప్రకరణం సంపూర్ణము.



[illegible] ప్రస్తుతము [illegible] వ్రాయుచున్న [illegible]
[illegible]లో పదవపోలు ఎస్టేటులో జమీందారుగారివద్ద చాలాకాలం పనిచెయ్యడం అప్పటి ప్రభువులవద్ద యెక్కువసమ్మకంతో వారిస్వేర సోస్టుద్వారా రాబడి రిజిష్టరీయిన్సూరు కవర్లు నగయిరాలు. చేవ్రాలుతో పుచ్చుకునేలాగు మొదలగు పనులయందు అధికారమునుపొంది యెస్టేటుతరఫున పనిజర్పడం యేర్పడినది సమస్థానం న్యాపరెండ్యాంటు హోదాతో చాలాకాలంపనిచేసిన దుగ్గిరాల రామదీక్షితులుగారికి శ్రీ పుమకిది గవర్నమెంటు అధికారులుగావున్న మహారాజరాజశ్రీ జడ్జి, కలక్టరిహోదాదార్లవల్ల ప్రవర్తన మంచిది అయినట్టుగా వ్రాతమూలంగా క్యారక్టర్లుపొందడం జరిగినది అందులో 19-4-90 తేదిని యల్. సి. మిల్లర్ [illegible] యెరుధొరవారు 4 సంవత్సరములనుంచి యెరుగుదుము అని వ్రాసినారు

మద్దిరాల బుచ్చిసుందరావుపంతులుగారు 1889 సంవత్సరంలో మంచి యోగ్యతగలవారు సంవత్సరమునుంచి యెరుగుదుము అని వ్రాసివున్నారు. యింకామరికొందరు కలక్టరిహోదాలోవున్న ధొరవార్ల సర్టిఫికట్లు యిచ్చివున్నారు.

చలసాని బాపినీడుగారు నగయిరా పరగణా పెత్తనదార్లుగావున్న రహితులతరఫున రెంటువ్యాజ్యములలో ఇన్స్ట్రక్షన్ యిచ్చి గ్రంథము జర్పుటచు ఏజంటుగా పనిజేయడం జరిగినది.

యెక్కువను తెలివిగా న్యాయంగామెప్పుపొందేలాగు ప్రతిపనిజర్పుటచేత ఇనుముగురించి అగ్నికి సంమ్మెటపెట్లువచ్చినరీతున కొన్ని క్రిమినలువ్యవహారములలో కష్టనష్టములు అయిష్టులుగానుండు సహింపు తక్కువవారల కుట్రవల్ల యేర్పడినను శ్రీరంగనాధుని కృపవల్ల న్యాయాధికారులు విచారణలో మెప్పుపొందడమే పర్యవసానంగా యేర్పడినది. వర్తమానకాలంలో సద్బోధనవ్రాయడంయందు నాయిష్టదేవరి

[illegible]
లేకుండా వుండేలాగు హాయిగా కాలం గడుపగలరు [illegible]
షుల హృదయంలలోనుండి యీ పని సాగించగలరు అని శ్రీ[illegible]
ని ధ్యానించెదను కర్మవశంకొలది వ్రయములు ఆదాయములు ఆప్త
లు సుఖదుఃఖసంతుష్టులు యోగ్యతా యోగ్యతలు వెల్లడికి రాగలవు.
కార్యాంతేవి వర్జయేత్ అని వుండకూడదు అనే న్యాయంవాలెంనే
కాలవిశేషమునుబట్టి అయినా కొందరికి రంగనాథుడు మార్చగలడని న
మ్ముతాను.

సుజనవిధేయుడు,

పెనుమూడి వెంకటప్పయ్య

